శ్రీరస్తు.

# శ్రీకృష్ణ శతకము



ప్రకాశిక

శ్రీరామ శతక కర్త ఏనుగు తమ్మిరాజు కవిగారు
తాపేశ్వరము.

1000 ప్రతులు

రీజన్ ముద్రాశాల:—రాజమహేంద్రి.
1924.

వెల:—భక్తి

# శ్రీకృష్ణశతకము.



## ఏకపాసి.

క. శ్రీరామ నామతారక
మేరికిఁ నుతించేమున్న నిష్టాప్తికినా
గౌరీమనోజ్ఞ భాస్కరు
నారాధించెదఁ ద్రిశుద్ధిననిశముఁగృష్ణా

క. గౌరీశుఁగొల్చి పిమ్మట
భారతవంశక్రమంబుఁ బ్రస్తుతిఁజేయన్
నేరిచినకొలదిఁ దెల్పెదఁ
గూరిమిఁదప్పున్నఁ బ్రోవఁగోరెదఁగృష్ణా. 2

క. భరతావనిఁ జన్మించినఁ
దురితంబులుపాయుఁ బుణ్యధుర్యుండగుచున్
నిరతంబుఁ విష్ణుసేవా
పరతంత్రుఁడగుచుఁ మిగులఁ భాసిలుఁగృష్ణా. 3

క. భరతాంబకుఁ బ్రభవించిన
నరు లక్షలకళావిశేష నానాధర్మో
ద్ధారులగుచుఁ భరతసుతులనఁ
నిరతముఁ వన్నెయునువాసిఁ నిల్తురుగృష్ణా. 4

క. భరతాన్వవాయప్రభవులు
పరతత్త్వార్థప్రభావ ప్రతిపాదకులై
ధరఁ "సత్యంవదధర్మం
చర" యనిబోధింతు రఖిలజనులకుఁ గృష్ణా. 5

క. భారతపుత్రులు సద్గుణ
చారిత్రులు సకలకార్యసాహసులు యశో
ధీరులు, శూరులు, విమలా
కారులు, సగుణస్వరూప కలితులుకృష్ణా. 6

క. భారతముఁ జదువకుండఁగ
నేరిచినకవిత్వమెల్లఁ నీరసమగుటన్
భారతముఁజదివి పిమ్మటఁ
ధీరులుచెప్పెదరుకవితఁ ధీధృతిఁగృష్ణా. 7

క. భారతరచనాధుర్యులు
సారసభవతుల్యులగుటఁ సకలజగములన్
భారతము లోకపూజ్యము
భారతకవిమండలికిఁ బ్రమాణముకృష్ణా. 8

క. సారంబగుసత్కవితా
ధారసుధారసముంబుదులఁ దనుపగఁ లేకన్
గ్రూరులుకు [illegible] లుకవితా
చోరత్వముఁ జేతురకట చోద్యముకృష్ణా. 9

భూరమణుఁడౌటఁ రాజును
భూరమణుండనుచుఁ గరము పూజింతురు త
ద్గౌరవము లేకపోయిన
రౌరవనరకములపాలు రాజులుకృష్ణా. 10

క. ధరనెల్లఁ జీవకోటికిఁ
ధరణీపతితల్లి, తండ్రి తగఁగురువగుటన్
ధరణీపతివాక్యంబా
చరణీయ మవశ్యమండ్రు సరసులుకృష్ణా. 11

క. నరపతి ధర్మముఁదప్పనఁ
నరులక్రమదోష భూషణవ్రతులైనన్
గఱవేలఁ గల్గకుండును?
గాఱలేలఁ జనింపకుండుఁ గొబ్బునకృష్ణా. 12

క. ధరపతి దుర్మార్గుండై
పరిపాలించెనువిధంబుఁ బరికింపనియా
నరుల ననాథారణ వా
నరులని నెన్నంగఁవచ్చునట శ్రీకృష్ణా. 13

క. శరణన్నఁ బగతునైనన్
ధరపతిరక్షింపకున్కి తద్దురితమునన్
మరణాసన్నము ప్రభునకుఁ
శరణ్యమూశమనుపురము జనులకుఁగృష్ణా. 14

క. పేరు ప్రతిష్ఠలు దెచ్చెడు
భూరమణునిఁ గొల్వ భుక్తిముక్తులు గల్గున్
ఊరును బేరును లేని ధ
రారమణునిఁ గొల్వ నేమి లాభము? కృష్ణా. 15

క. భూరమణుఁ డెల్లవేళలఁ
గ్రూరామాత్యులతోఁ జనవు గొంకక నీయన్
గోరంతలు కొండంతలు
గాఁ రూఢిని నర్చి కొంపఁ గాల్తురు కృష్ణా. 16

క. భూరమణుఁ డేలు రాజ్యము
దారుణపాపాభిధాన ధామం బైనన్
సూరులు జీవచ్ఛవములు
క్రూరులు మృతజీవులౌర గోపాకృష్ణా. 17

క. ధరణీపతి ధర్మంబును
సురుచిరముగఁ గ్రోవలేని చోఁ "రాజ్యాంతే
నరకం ధ్రువమ్మ"టంచును
బరమజ్ఞానులు వచించు పల్కులు కృష్ణా. 18

క. పురుషులలోపల నుత్తమ
పురుషులు గన్పింతు రెల్లభూములయందున్
పరుషములు పల్కకుండఁగ
సరళమ్ములు వీడకుండఁ సత్యము కృష్ణా. 19

క. పురుషుం డార్జింపఁదగిన
పురుషార్థము లవ్విగలవు పూజ్యములగుచున్
పురుషార్థుడయ్యుఁవానిని
యెరుగకఁ నటియించువాడు హీనుడుకృష్ణా. 20

క. చిరకాల జీవనంబునఁ
నరుడేలఁయశంబుఁగాంచుఁ నానాగతులన్
వరకీర్తి యంతసులభమె?
వరియించుటకతని నెట్టివార్తలుకృష్ణా. 21

క. నరజన్మ మెత్తినందుకు
కరుణారసమొందు హృదయకమలమునందున్
గుఱితించి జీవకోటినిఁ
బరికించుట భావ్యమండ్రు ప్రాజ్ఞులుకృష్ణా. 22

క. పరులకుఁబెట్టరు కుడువరు
సిరిఁదాచెద రేఁటిబుద్ధి చెడిపోకుండన్
సెరతేనె తేనటీగలు
తెరవరుల కొసంగుతెరంగు తెలియరుకృష్ణా. 23

క. దీరుఁడపారంబగు సం
సారంబుఁ భరించెనేనిఁ శాంతముతోడన్
నీరజపత్రగతంబగు
నీరంబట్లులఁమెలఁగుఁ నిత్యముఁగృష్ణా. 24

నరుఁడజ్ఞానవశంబునఁ
మరణింతునటంచుఁ భయము మది పెనవేయన్
పరిరోదనంబుఁసల్పెడుఁ
బరిరోదన మొందఁడెపుడు ప్రాజ్ఞుఁడుకృష్ణా. 25

మరణంబు మరణమంచును
నరు లధికభయంబుగదురఁ నానాగతులన్
పరుగిడెద రేమిపాపము
పరుగిడినఁ భయంబువిడునె పతితులఁగృష్ణా. 26

మరణించుట జన్మించుట
పరమాద్భుత ప్రకృతిచర్యఁ బరికింపఁదగున్
బరికించి మోక్షలక్ష్మి
చరణములు పరిగ్రహింప చతురతకృష్ణా. 27

మరణంబుఁ గన్నుపిమ్మట
నరుడాస్వర్గాదిభోగ నానాసుఖముల్
పరికించునను టదబ్బర
పరికించుట బ్రతికియున్న భాగ్యముకృష్ణా. 28

మరణాపన్నుఁడు సిదగు
చరణములాసించి శరణుశరణని వేడన్
మరణార్తుఁ దీర్చ్ప్రోవగఁ
నరగునఁ బ్రత్యక్షమగుట సత్యముకృష్ణా. 29

క. ఏరీతినైనఁ మృత్యువు
బారింపబడిపోవుటరయఁ వాస్తవమగుటన్
"ఏరికిఁవారే యమునా
తీరే'యను ధీరసూక్తి తిరమగుఁగృష్ణా 30

క. నీరనొ నింగినొ నేలనొ
దారుణ మృత్యువులభించుఁ దప్పకనపు డా
బారింబడి ధ్యానింతునె?
మీరూపమ్మిపుడు ప్రోవుమీననుఁగృష్ణా 31

క. ఏరికిఁ దోఁచినమార్గము
వారికినచ్చుటఁ విశేషమై భవమనుచున్
ధీరులు సూపినమార్గముఁ
క్రూరులు కనెత్తి చూడఁగోరరుకృష్ణా. 32

క. శ్రీరామ నామ తారక
సారామృతపానమత్త స్వాంతుడగు త
ద్ధీరుండు జననమరణ
క్రూరరుజా ఘోరభీతిఁ గోరడుకృష్ణా. 33

క. నీరాజనీతిఁభూతియుఁ
నీరాజద్భక్తియుక్తి నిరుపమశక్తిన్
ఏరాజ
ఏరాజు

క. సారసభవాదులైనను
బ్రారబ్ధముఁదాటలేరు బహువిధగతులన్
గూరిరుండఁ జడుడఁ శరుడను
నేరీతిఁదరింపనేర్తు నెరుగనుగృష్ణా. 35

క. సారోదక బలమునఁగా
సారంబులఁ బెరుగుసారసంబులఁ ద్రుంపన్
వారణము పోవు తెఱగునఁ
గ్రూరులఁ మారణమొనర్పఁ గోరుము కృష్ణా. 36

క. పేరున్నమాత్రనీఁచుడు
ధీరునిగతిఁ నొలఁగఁగలఁడె దివ్యస్ఫూర్తిన్
గాఱెనుముపోతుబ్రతికిన
వారణ మట్లుపచరింపఁవశమే? కృష్ణా. 37

క. కారణములేనివైరము
ధీరులపైఁజూపి వారిధీధనమెల్లన్
జోరత్వమునఁ హరించుట
క్రూరులకిది సహజగుణము గోపాకృష్ణా. 38

క. వీరులలోఁ వీరుండవు
భూరమణులలోన మేటిభూరమణుఁడవున్
శూరులఁ శూరుండవునై
పౌరుషకీర్తులు గడించి ప్రబలితికృష్ణా. 93

క. పరమజ్ఞానం బొసగెడు
గురునకుఁ సాష్టాంగమిడని క్రూరాత్ముండా
సిరిరాఁ మోకాలొడ్డెడు
నరునిగతిఁ జింతఁగాంచునట శ్రీకృష్ణా. 40

క. పురుషప్రయత్నమున కా
పరాత్పరు డనుగ్రహింపఁ ఫలియించుఁ వెసన్
పురుషుం డద్దియొనర్పక
పరమేశ్వరుఁడెట్లొసంగుఁ ఫలములుకృష్ణా. 41

క. వీరుఁడు రణమునఁ బారినఁ
బాఱుఁడు క్రోధంబుఁగనినఁ బ్రభువన్యాయం
బేరినఁ గ్రూరాత్మకులై
చేరుదు రాశమనపురము సిద్ధముకృష్ణా. 42

క. దురితాత్ములగు మనుష్యులఁ
బరికించినఁ బాపమగుటఁ బండితవర్యుల్
దరిఁజేరనివ్వకుందురు
దరిఁజూపగఁనైనరారు తథ్యముకృష్ణా. 43

క. నరుఁడెన్ని సద్గుణంబులఁ
బరగినలోభంబొకండు ప్రబలినమాత్రన్
చిరఁజీవిరీతిఁ బ్రతికెడు
చిరఁజీవి యటండ్రు వానిఁ సిద్ధముకృష్ణా. 44

క. దూరుదురా భగవంతుని
క్రూరులు తమపాపకర్మకోటిం బుద్ధింధరులై
నారొసగువాడుపోయడె
నీరనుధీరోక్తి తెలియనేరరుకృష్ణా. 45

క. ఘోరమగు మృత్యుదంష్ట్రలం
జేరిక గ్రశించినను గాని చెన్నటియొజగళ్
నేరకకన్నులుగానక
నారీమణి పొందుగోరునట శ్రీకృష్ణా. 46

క. శ్రీరమణ మీకుమారుడు
మారుండంట పాంథలోకమారకుండంట దు
ర్వారుడంట యిట్టిచిత్రము
లేరును బరికింపరట మహీపతికృష్ణా. 47

క. మారుడు క్రూరుడు శుకపిక
వారము దుర్వారములట వాసంతిక ఝంకా
భారంబు తాళజాలనె
నారీమణిరాధ జీవనమ్ములకృష్ణా. 48

క. ఏరైనం గౌరవార్థము
సారెకుం సారెకును బిల్వ నయ్యనబోవక
గౌరవముగాని పిలువని
పేరంటములొప్పునటే తీరమటకృష్ణా. 49

క. గౌరవమునొసఁగి పిమ్మట
గౌరవమది తెచ్చుకొనుట ఘనలక్షణమా
గౌరవము లేక నిచ్చిన
గౌరవమది మంటఁగల్పఁ ఘనమే? కృష్ణా. 50

క. క్రూరతఁ దుష్టచతుష్టయ
మారణమునఁ బాండుపౌత్రు నభిమన్యుఁ వెనక్
మారణముఁ జేయ నెరిగియుఁ
గారణ మెరిగింప వెట్టిఘనుడవు కృష్ణా. 51

క. క్రూరుండొక్కఁడు ధీరునిఁ
మారణ మొనరింపఁ దిరుగువురు గెరిగింపక్
వారించువారు లేరొకొ
వారించక తెల్విలేనివారొకొ కృష్ణా. 52

క. ప్రారబ్ధకర్మ మాత్రము
దారుణబల తీవ్రమైనఁ దప్పించుకొనక్?
సారససంభవుఁడైనను
నేరండె నేఁ బాధ్యుడవుదు నిక్కముకృష్ణా. 53

క. పరులెరుఁగరనుచుఁ దుష్టుడు
నరునొక్కనిఁ నణుకబూనున ఘుబద్ధుండై
పరులెరుఁగరె? తనకంటెను
బరమే భూతాదిసాక్షివర్గము కృష్ణా. 54

క. క్రూరులు పెఱుగుట, సూరులు
భీరువులై పేరులేక విరుగుటయుఁ మహా
భారంబటంచుఁ ధారుణి
గోరూపిణి నిన్నుఁ జూచు కోరికకృష్ణా. 55

క. ఈరీతిఁ జూడఁ వచ్చిన
ధారుణికిఁగని యభయమిచ్చి, తద్భారాగ్నిన్
మారణముఁ జేయఁ నేర్పునఁ
గారణ మొందూహాఁ జేయఁ గడగితికృష్ణా. 56

క. ధరణీభారముబాపుట
పరమావశ్యంబటంచుఁ వసుదేవునకున్
బరమాత్మ! కృష్ణనామక
వరసూనుఁడవైతి వద్ధిభాగ్యముకృష్ణా. 57

క. ఈరీతిఁ నీవుఁబుట్టుట
క్రూరుఁడు కంసుండువిన్నఁ గూల్చునటంచున్
ఆరాత్రినె వసుదేవుఁడు
చేరెను వ్రేపల్లెనిన్నుఁ చేకొనికృష్ణా. 58

క. ఏరు సహాయ్యము లేరని
నేరక పోఁబోవుచున్న నేఱడ్డంబై
దారిచ్చెనంట చిత్రము
దారివ్వారె నిన్నుఁగన్నతండ్రికిఁ గృష్ణా. ౫౯

క. ఆరాత్రివేళ నందుని
నారీమణిఁజేర్చి నిన్ను నటపైనాతం
డారామకూతు చేకొని
ధీరుండై పోయెఁ జెఱకుఁ దివ్యముకృష్ణా. 60

క. ఏరికిఁగల్గనిభాగ్యం
బీరీతిఁలభించెఁ గొల్లకేమందుఁ భళీ
వారెట్టి పుణ్యమూర్తులొ
వారెట్టి తపఃప్రభావభవ్యులొ కృష్ణా. 61

క. మారునాడు లేచి నందుని
తరుణీమణిఁగాంచి యిద్ది దైవవిలాసం
బరయంగఁ మనకుఁశుభమని
పరివారలతోడఁజెప్పెఁ జయ్యనకృష్ణా. 62

క. శ్రీరమ్యాకారంబునఁ
భూరి ప్రాభవమొసంగు పుత్రునిఁగాంచన్
జేరి యశోదానందులు
కూరిమిఁ గొనియాడిరపుడు కొడుకునకృష్ణా. 63

క. అలతిఁ బాలభాస్కరు
తీరైదీపించువానిఁ దివ్యాకారున్
జేరి యశోదానందులు
కూరిమిఁ గొనియాడిరపుడు కొడుకునకృష్ణా. 64

క. ఏరును జేయని సుకృతం
బీరీతిఁ లభించెఁమాకు నిట్లనిపుత్రుఁ
జేరి యశోదానందులు
గూరిమిఁ ముద్దాడిరపుడు కొడుకునుకృష్ణా. 65

క. ఈరీతిఁ తల్లిదండ్రులు
గూరిమిఁ ముద్దాడుచున్న గోపిక లెల్లన్
జేరంగఁవచ్చి మిమ్మున
పారశుభాకారుఁగాంచి పాడిరికృష్ణా. 66

క. హారతిఁగైకొనవేమొకొ
మారాసుకుమార మారమాహృచ్చోరా
మారాకారాయని వే
మారా సుకుమారుఁలుగూర్చి మగువలుకృష్ణా. 67

క. ఈరీతిఁ గొల్లలెల్లరు
గారవమునఁ జెఱుగుబాలుఁగాంచి భజింపన్
వారీతిబడక నిరతముఁ
గారవమునఁ బెరుగుబాలుగాంచిరి కృష్ణా. 68

క. మీరిట్లుద్భవమందుట
క్రూరుఁడు కంసుఁడెరింగి కుచ్చితబుద్ధిన్
శూరులఁబూతన మొదలగు
చారులఁ నినుగూల్పఁబంపె జయ్యనఁగృష్ణా. 69

క. ఆ కేండ్లప్రాయంబు నె
వారినిఁవధియించి పిదప వారికిఁ బ్రభువౌ
క్రూరుఁడగు కంసరాజును
మారణమొనరించినావు మాయురె కృష్ణా. 70

క. ఈరీతిఁ దల్లిదండ్రుల
కారూఢ ముదంబుఁగూర్చి అలగోపికలన్
జేరుచుఁ గంతులు వైచుచుఁ
గేరుచుఁగాచెదవు మివులఁ గ్రేపులఁగృష్ణా. 71

క. నీరూపము నీ తేజము
నీరేజభవాండమెల్లఁ నిండి వెలుంగన్
మారుని బారికినోర్వని
నీ కేజదళాక్షులపుడు నిగనఁగృష్ణా. 72

క. మీరేలఁ జంతపొందెద
రీ కేలఁ నిరంతరంబు నిటఁ విహరింపన్
మీరతిసౌఖ్యముఁ బొందఁగ
గోరికలీడేరు ననెదుకొంటివుకృష్ణా. 73

క. ఈరీతిఁ నర్మభాషల
నారామలమానుక్రీడ నలరింపగ నీ
వారాటము చేసెదవట
పోరాటముచేసెదవట పోలునెకృష్ణా. 74

క. మీరిట్లుఁ జేయఁ గొల్లలు
కూరిమితోఁ మందలింపఁ గోరియశోదన్
జీరితమ నుపుత్రుం డిటు
నేరచె నేమందుమంద్రు నిక్కముకృష్ణా. 75

క. వారిట్లు చెప్పఁ దల్లి కు
మారునిఁ జేరంగఁ బిల్చి మాధవ నీకీ
తీరేరు చెప్పినారని
తీరుగతిన్ మందలించుఁ దివ్యముకృష్ణా. 76

క. ఈరీతిఁ బెంచునందుని
నారీమణికపుడు నోటఁ నానాజగదా
ధారమగు నీస్వరూపము
దారతఁ జూపించినావు దద్దయుఁ గృష్ణా, 77

క. నారీమణి యారూపం
బారసి నిచ్చేష్టయగుచు నమ్మహితాత్మన్
యీరీతిఁ స్తుతియించెను
యీరీతిఁ భజంచెఁ మిగుల నింపుగఁ కృష్ణా. 78

క. శ్రీరమణ నీవు మార్త్యా
కారంబున నవతరించు కారణమది భూ
భారంబుఁ దీర్పఁ గ్రూరులఁ
మారణమొనరించు తెరఁగు మఱుఁగిది కృష్ణా. 79

క. ఏరీ భూతములైదును
దారతఁసృష్టించునట్టి దైవముమాకీ
తీరునఁ బొడసూపుటఁ మా
భూరిప్రాభవముగాదెఁ పుణ్యా కృష్ణా. 80

క. ఏరీతి నెన్నిజన్మలఁ
నీరూపముఁ జూడలేరు నిక్కపుదైవం
బీరీతిఁ మాకుఁగల్గుట
భూరితపోబలముగాదె పుణ్యా కృష్ణా. 81

క. వరములు, రిపులోకవి భీ
కరములు, సంపత్కరములు, కరమామోదా
కరములు, లక్ష్మీకరములు
హరినీకరములు మహాఘహరములు కృష్ణా 82

క. చరణములు, భక్తలోకా
భరణంబులు సాధుపురుష భయహరణంబుల్
పరిపంథి భీకరణములు
హరినీచరణములు దురితహరములు కృష్ణా. 83

క. మారంగఁటనుచుఁ నిన్మన
మారంగడుఁ గొల్చుభక్తిమార్గము క్రూరుల్
గోరంబోలరుగదనీ
గోరథబోలుదురె దైవకోటులు కృష్ణా. 84

క. ఈరీతిఁ సన్నుతించిన
నారూపంబుపహరించి యటపైఁ బాలుం
డారామఁ జేరఁవచ్చినఁ
గూరిమిఁముద్దాడెఁ దనదు కొడుకని కృష్ణా. 85

క. శారద చంద్రజ్యోత్స్నలఁ
సారెకుఁ సారెకునుబిల్చి సారసముఖులన్
గూరిమిఁ రాసక్రీడలు
గోరెదవట నీకుఁదగునె? గోపా కృష్ణా. 86

క. తరుణులు జలకములాడెడు
తఱిఁ జీరలుదొంగిలించి తీరుమధ్యమునన్
గుఱుతింపకుండఁ గూర్చుని
తరుణుల మఱుఁగెఱిఁగినావు ధర్మమె కృష్ణా. 87

క. ఈరీతిఁ శైశవము శృం
గారంబుగఁ నడపుచుండి కడకొకగురినిన్
జేరికల విద్యలెల్లను
నేరిచితివి నిన్నుఁబోలి నేరరు కృష్ణా. 88

క. ఆరీతిఁ సకలవిద్యలు
నేరిచి మారామ రుక్మిణీమణికన్యన్
మీరు వివాహంబాడిరి
భూరిప్రాభవము మెరయఁ భూమిని కృష్ణా. 8

క. మా రామను బెండ్లాడిన
వారములోపలనె మిమ్ము వలచినవారై
వారిజనేత్రలు వచ్చిరి
కూరిమిఁ బదియారువేలు గొబ్బునఁ కృష్ణా. 90

క ధరఁ నొక్కతెఁ బెండ్లాడిన
సరగునఁ భరియింపఁ లేరు సంసారంబున౯
హరియెట్లు పెండ్లియాడితి
తరుణులఁ బదియారువేలఁ దండ్రీ కృష్ణా. 91

క. మీరిట్లు చేయుకార్యము
లీరేడు జగంబులందు నెపుడుస్మరింప౯
సూరులు లక్షలు గలనవి
నేరుచునే నన్నుఁ బోలు నీచుఁడు కృష్ణా. 92

క. నేరిచియో నేరకయో
మీరీతి వచించినాడఁ మిక్కిలి ప్రేమ౯
మీరరయుఁ నాదువిన్నప
సారాంశము నన్నుఁ బ్రోచు సమయము కృష్ణా. 93

క. నరనారాయణు లిర్వురు
పరమ తపోధనులు ధర్మమార్గాన్వితులై
భరతావనిఁ జన్మించుట
భరతాన్వయ మఖిల .. క భవ్యము కృష్ణా. 94

క. కౌరవులును పాండవులును
దారుణ రణమాచరించు తరుణంబునఁ ద
త్కౌరవులఁవీడి పాండవ
ఖీగులకిప్పించితివఁట విజయము కృష్ణా 95

క. భారతరణమునఁ బార్థుని
తేరుఁ గడుపజాలునట్టి ధీరులు లేమిన్
సారథివైతివి భళినీ
సారథ్యము చిత్రమయ్యెఁ జగమునఁ గృష్ణా. 96

క. ఎఱుఁగక చేసిన పాపం
బెఱిఁగి యనుభవింపవలయు నియ్యది నిక్కం
బెఱుగరు నరులని పల్కరు
నెఱిఁగింపవె నరునకప్పుడెంతయు కృష్ణా. 97

క. ఈరీతిఁ దమచరిత్రము
ధీరులు నుతియింపఁజెప్పితిని దప్పున్నన్
గూరిమిఁ క్షమియింపఁగఁ న
న్నేరీతిఁ భరించువాఁడ నెఱుఁగను కృష్ణా. 98

క. పరమోపకార చతురత
పరహితుఁడు గ్రహించునట్లు పతితుఁడెఱుగునే?
ధరణీభారము శేషుం
డెరిగినగతిఁ బురదపాము లెరుఁగునె? కృష్ణా. 99

క. పరహితముఁ గోరువారికిఁ
పరమేశ్వరుఁడే సహాయపడు నని శెంబుఁగ
పరమార్థ కార్యసంతా
పరహితులనొనర్చి ప్రోవఁభవ్యా కృష్ణా. 100

క. ధరలోఁ గొందర హింసా
పరమోధర్మాయటన్న వచనామృతముల్
గురిపించి చిట్టచివరకుఁ
గఱపింతురసూయ వృశ్చికములను కృష్ణా. 101

క. దరహాసచంద్రికలు సుం
దర వదనాబ్జంబులందుఁ నాట్యంబాడఁగ
సరసులగతిఁ నటియించుచుఁ
పరసులఁబాధింత్రు పాపజాతులు కృష్ణా. 102

క. అర వేతఁ మాధురమకరం
ద రసఁ బోక యింతఁబోసి దాహముదీర్పఁగ
కిరమూఁడముఁ జూపింతురు
ఖలజాతి పవిత్రజన ముఖములకుఁ కృష్ణా. 103

క. నరకద్వారము మాయా
కరమార్గముఁ దోషపోషకేతమఁ సంసా
ర రుజాసంతాపము ఛీ
తరుణీయంత్రంబు పుణ్యదళితము కృష్ణా. 104

క. పరలోకమార్గవిఘ్నము
పరమాఘ సమూహా కూపపతనము సన్మా
ర్గరతధ్వంసము గావునఁ
పరకాంతా విహరణంబు పాపము కృష్ణా. 105

క. దురితాభివృద్ధి కతమునఁ
నరకము, నరకంబువలనఁ నానాపుణ్య
స్ఫురణధ్వంసముగావునఁ
పరకాంతా విహరణంబు పాపము కృష్ణా. 106

క. దురితస్ఫురణ మకీర్త్యా
భరణము చింతాదురంత పాలితన వ్యా
వరణము, మరణము గావున
పరకాంతా విహరణంబు పాపము కృష్ణా. 107

క. పరమాయు క్షీణంబును
స్థిరచిత్తవినాశకంబు ధీమాంద్యంబుఁ
మరణాసన్నము గావునఁ
పరకాంతా విహరణంబు పాపము కృష్ణా. 108

క. నిరతాన్నదాన సుకృతము
ధరగోవిద్యావిధాన దానములును త
ద్దురితము నడఁపవు గావునఁ
పరకాంతా విహరణంబు పాపము కృష్ణా. 109

క. పరవిద్యలెన్ని నేర్చిన
పరమార్థంబరయఁగలఁడె పండితుఁడైనన్
దురితాంధకార బద్ధుఁడు
పరతత్వంబెట్లెఱుంగుఁ బల్కుము కృష్ణా. 1

క. పరదూషణ దోషంబునఁ
పరమాఘము సంగ్రహించి పాపాత్ముండై
పరలోకమార్గ భంగము
పరమావశ్యకముగాఁ బడయును కృష్ణా. 1

క. ధరణీదేవులు, రాజులు,
వరవైశ్యులు, శూద్రవరులు, ప్రతిభాన్వితులై
ధరఁ హిందూమత కల్పక
తరువును రక్షింత్రుగాక తండ్రీ కృష్ణా. 1

క. ఏరీతినైనఁ ధర్మ
ప్రారంభముఁ జేయఁలేము బహుధనమైనన్
ధారాళముగఁ గడింపము
మారీతిఁ దలంపఁ గుజనమార్గము కృష్ణా.

క. ఏరీతినైనఁ సాధులఁ
జేరము తద్బోధవినము చిత్తవికారం
బారపము చిల్లిగవ్వకుఁ
మారము మావృత్తి కుజనమార్గము కృష్ణా.

క. నూరన్నళోల్కిఁ గవితా
సారముగురిపించి రాజచంద్రులఁ గొల్వన్
నేరమిక పూర్విక్రైనను
మారము మావృత్తి కుజనమార్గము కృష్ణా. 115

క. ఏరిని లేదని వేడము
పూరికిఁ గొఱగానివారిఁ భూషింపము మా
తీరు ఋజమార్గసార వి
చారము తద్వారితులకుఁ జంకము కృష్ణా. 116

క. దురితము సేయు నేరము
నిరతము నినుఁ భజంచేయఁ నేరము దుర్మా
ర్గ రతులము ధర్మమార్గము
మరతుము మావృత్తి కుజనమార్గము కృష్ణా. 117

క. వారికిఁ వీరికిఁ బలెమే
మేరిని యాచింపబోము నృపులైన సదా
చారము మీరిన నోర్వము
సారన్యాయంబుఁ దెల్పఁ జంకము కృష్ణా. 118

క. మీరీతిఁ దెలియనేరము
మారీతిఁ వచింపలేము మామార్గము సం
సారగాఢహనిబద్ధా
ఘోరకూరము విశేష కుటిలము కృష్ణా. 119

క. మీరీతిఁ దెలియనేరక
కూరిములు బహుగతులుమిమ్ముఁ గొల్చెడువారై
జారత్వము చోరత్వం
బారోపింతురు యథార్థ మారయరు కృష్ణా. 120

క. చారలఁగొల్చెడు కన్నులు
సారసమునుఁబోలు ముఖము చాంపేయంబుల్
నేరెడు నాసికనమరెడు
నీరూపముఁ జూపుమిపుడు నిక్కము కృష్ణా. 121

క. ధరసింహాసనమభ్రము
వరఛత్రము దివ్యులెల్లఁ వందిగణంబౌ
సిరిభార్యామణిగాఁ నీ
పరివారలు లేక జగముఁ సాకుము కృష్ణా. 122

క. శ్రీరామ కృష్ణ శతకము
నీకిటు రచించినాడ నేక ప్రాసన్
మీరరసి యేదోషము
తారూఢిఁ క్షమింపవలయు ననిశము కృష్ణా. 123

క. ధారుణినేనుఁగు వంశో
ద్ధారకుఁడగు బుచ్చిరాజు తనయుఁడుఁ కవితా
స్వారస్యామృత పానపి
సారసజా చారనయుఁడు సాకుము కృష్ణా. 124

శ్రీ

# సీతారామశతకము

ఇది

చామర్లకోటభీమవరగ్రామకాపురస్థుఁడును
మండపేముల్ల వెంగయాఖ్యసుధీమణిపుత్రుండునగు
వెంకయాఖ్యునిచే రచియింపఁబడి
బ్రహ్మశ్రీ ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రిల
వారివలనంబరిష్కరింపఁబడి

చామర్లకోట కాపురస్థులును శ్రీపరమేశ్వర
చరణారవిందమరందపానతుందిలేందిందిరాయ
మానమానసులునగు
గున్నాబత్తుల సుబ్బయ్యగారిచే
ప్రకటింపబడియె.

మొదటికూర్పు 500

కాకినాడ
కమలాముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె
1916